శ్రీ రామచంద్ర పరబ్రహ్మణేనమః

# వేదాంతవ్యాస రత్నావళి

## మూడవ భాగము




రచన :

వెంపటి లక్ష్మీనారాయణ శాస్త్రి

మహర్షిభ్యోనమః

# నా విజ్ఞాపన

మహర్షులు సమాజక్షేమానికి ఎన్నియో మహత్కార్యములు చేసియున్నారు. వాటిని మనము తెలుసుకొని సంతసించుచున్నాము. వారు సమాజమునకు తెలియజేసిన హిత విషయములు ఎన్నియో యున్నవి. అవి యన్నియు అమృతభాషయయిన సంస్కృత భాషలో యున్నవి. ఈనాటి వారికి అవియన్నియు చదివి తెలుసుకొనుటకు అవకాశము లభించకపోవుటయేగాక శక్తియు చాలుటలేదు. అట్టివారి నిమిత్తము శాస్త్ర సమ్మతములయిన కొన్ని విషయములను వేదాంత వ్యాస రత్నావళి అను పేరుతో ముద్రించదలచి ఇంతకు పూర్వము రెండు భాగములు ప్రకటించితిని. వాటిని సహృదయులు చదివి మెచ్చుకొనిరి. వారి ప్రోత్సాహముతోనే మూడవ భాగము రచించి ముద్రణ సహాయమునకై ఎదురు చూచుచుంటిని.

అట్టి సమయమున మాకు బంధువులు సహృదయులయిన చి॥ **మార్తి రామకృష్ణశాస్త్రి**ని కలుసుకొను అవకాశము దైవ నిర్ణయముగా లభించినది. వీరు శ్రీవత్సస గోత్రీకులు. వీరి తండ్రిగారు కోదండపాణిగారు. వారు వైదిక వృత్తిలో జీవించుచూ, సత్పురుషుల ఆదరాభిమానములు సంపాదించిరి. వారి కుమారులయిన వీరు తండ్రిగారి మార్గములో జీవించుచు, విదేశములందుగల భారతీయుల ఆహ్వానముపై అమెరికా దేశమునకు వెళ్ళి అచ్చటకల భారతీయులను వైదిక మార్గములో ప్రవర్తింపజేయుచున్నారు.

నేను కోరిన వెంటనే ఈ గ్రంధ ముద్రణకు సంపూర్ణ సహాయము చేసి, వారిని వారి కుటుంబమును భగవంతుడు సర్వాభీష్టములనిచ్చి ఇతోధికముగ రక్షించుగాకయని ప్రార్థించుచున్నాను.

24-6-2001
విజయవాడ.

**- రచయిత**

# విషయ సూచిక





# వేదాంత వ్యాస రత్నావళి

## మూడవ భాగము

### 1. సృష్టి వైచిత్రి

భగవంతుడు సమస్త ప్రాణికోటికి కావలసిన సుఖసాధనముల నన్నిటిని యిచ్చి భూలోకానికి పంపాడు. ఆ సాధనములన్నియు అత్యుత్తమ ములయినవి ఎచ్చట లభించనివి, అత్యవసరములయినవి. ఆయన కరుణా సముద్రుడుగదా. అయినప్పటికిని కోరకుండానే లభించిన సుఖ సాధనములను మరచి మానవుడు బయట వున్న అనిత్యములయిన సుఖ సాధనములకోసం పరుగెత్తుతున్నాడు. తన దగ్గరగల సుఖ సాధనములన్ని తన స్వాధీనములోనివి. బయట వున్నవి పరాధీనములయినవి.

సర్వం పరవశం దుఃఖం సర్వమాత్మవశం సుఖమ్ అని మహర్షి మనువు నిర్వచనము.

మానవుడు కారు కావాలని ఆశపడుతున్నాడుగాని దేవుడిచ్చిన కాళ్ళు కార్లకంటె ఉన్నతమయినవి అని గుర్తించలేకపోవుచున్నాడు. కారు లేకపోయినా మానవుడు ప్రయాణించగలడుగాని కాళ్ళు లేకపోతే కదలలేడు. అటులనే బయట గల సుఖసాధనములన్నియు ఇటువంటి లక్షణములు గలవే. మంచి దృశ్యము ఆనందమును కలిగించునను కొనుచున్నాడు. కాని ఆ దృశ్యముకంటె దానిని చూడగలిగిన కన్నులు ఉన్నతములయినవి అని తెలిసికొనుటలేదు. అటులనే మానవునియందు

ఇమిడివున్న సుఖసాధనములన్నియు బయటగల సుఖసాధనములకంటె శ్రేష్ఠమయినవి అని గుర్తించగలిగితే బాహ్యమయిన సుఖసాధనముల కొరకు పరుగులు పెట్టుట కొంచెము తగ్గు అవకాశమున్నది.

ప్రపంచమున ప్రసిద్ధులయిన మహా పురుషులు కొందరు గలరు. వారిని అందరు ఎల్లకాలములయందును ఆదరించి గౌరవించుచున్నారు. వారు తమకు భగవంతుడిచ్చిన సుఖసాధనములచేతనే యంతటి గొప్పవారయినారుగాని బాహ్య సాధనములచేతగాదు. అనగా వారు బయట లభించు ధన కనకాదులచేతగాని భోగభాగ్యముల ననుభ వించుటచేతగాని గొప్పవారు కాలేదు. తమకు భగవంతుడిచ్చిన ఇంద్రియముల యందలి శక్తి తెలుసుకొని వానిని క్రమ మార్గమున ఉపయోగించుటచేత ఉన్నతులుగా మన్ననలు పొందుచున్నారు.

ఈ యౌన్నత్యమునకు ప్రధాన కారణము మనస్సు. మనస్సు అతి చంచలమయినది. దానిని సరియైన మార్గములో పెట్టగలిగినవారే మహాత్ములయినారు. మనము సామాన్యంగా ఉన్నత పదవులు పొందినవారిని, మంత్రులు ప్రధానమంత్రులు రాజకీయ నాయకులయిన వారిని గొప్పవారిగా భావిస్తాము. అది కొంతకాలము మాత్రమే. ఎందుకంటే వారు పదవిలో ఉన్నంతకాలమే వారి వలన సమాజానికి ఉపకారము కలుగుతుంది. తరువాత వారి వలన ఎట్టి ఉపకారము జరుగదు. అందువలన వారిని మరచిపోతాము. మహాత్ముల విషయము అటువంటిది కాదు. వారు చేసిన యుపకారము సర్వకాలముల యందు సమాజానికి లాభము చేకూరుస్తూ వుంటుంది. వారు తమ మాటల ద్వారా చేతల ద్వారా మంచి విషయాలను సమాజానికి అందజేయ గలిగారు. అయితే ఆ విషయాలను వారు ఎటుల అందజేయగలిగారు. వారికి ఆ శక్తి ఎట్లు వచ్చినది అనేది తెలియదగిన విషయము.

వారు అందరివలె బయట కనిపించు విషయాలపై ఆసక్తి వదలి అంతర్గత విషయములపై దృష్టి సారించారు. అనగా తమయందుగల

భగవంతుడిచ్చిన ఇంద్రియములపై దృష్టి సారించారు. అందువలన వారికి ఆ శక్తి వచ్చింది. అంటే ఏమిటి. కన్నులు మూయుటవలన వారికి బాహ్య విషయములపై కోరిక తగ్గింది. అటులనే చెవులను మూయుట వలనగూడ బయటి విషయములపై ఆసక్తి తగ్గింది. ఇంద్రియములను నిరోధించుటవలన మనస్సుకు ఆరాటము తగ్గింది. ప్రశాంతత ఏర్పడింది. అప్పుడు ఆ మనస్సు తన క్షేమమును లోకక్షేమమును గురించి ఆలోచించింది. దానివలన జీవునికి శాంతి లభించింది. సద్వస్తుగోచర మయింది. దానిని గుర్తించి లోకమునకు అందజేశారు; వారు అనుభవించారు.

మనమూ అటులనే చేయాలి. ముందుగా ఒక విషయం గుర్తించాలి. ఉన్నత పదవులు ధన సంపాదనలు ఇతరుల ఆధీనములోనివి. ఇతరుల దయపై ఆధారపడినవి. మన ఇంద్రియములు మన స్వాధీనములోనివి. కన్నులు మూయుట మన స్వాధీనము. చెవులు మూయుట మన ఇష్టములోనిది. రుచిని మానుట మన స్వాధీనము. కాబట్టి ప్రతి దినము నియమిత సమయములో కొద్దిసేపు మౌనముగా ఉండగలిగినచో మనకు సద్వస్తు దర్శనమగును. మంచి గోచరించును. మనము మహాత్ముల దోవలో నడువగలము. లోకమునకు మంచి కలుగును. ఇదియంతయు మన స్వాధీనములోనిది.

మన స్వాధీనములోనున్నదానిని విడచి అందనిది అనవసరమయిన దానిని పొందుటకు ప్రయత్నించుట సృష్టి వైచిత్రియేగదా!

## 2. వానలు ఎందుకు కురవవు? ఎలా కురుస్తాయి!

విజ్ఞానశాస్త్రం పెరిగిపోతున్నది. పరిశ్రమలు రోజురోజుకు పెరుగు తున్నాయి. వాతావరణ కాలుష్యం చుట్టుముట్టుతున్నది. జలవాయు శబ్ద కాలుష్యాలు పెరిగి జీవరాశులు రోగగ్రస్తులవుతున్నాయి. ఇట్టి పరిస్థితు

లలో వానలుకూడా కురవకపోతే జీవరాశి నశిస్తుంది. ఏ పరిశ్రమలు లేకపోయినా ప్రాణులు బ్రతుకుతాయి కాని ఆహారం లేకపోతే ఏ ప్రాణులు బ్రతకలేవు. ఈ విషయం గమనించని విజ్ఞాన శాస్త్రవేత్తలు వివిధ యంత్రాల నిర్మాణానికి కృషిచేస్తున్నారేగాని ఆహార విషయంలో శ్రద్ధ చూపటంలేదు.

భారతీయ సంస్కృతి కర్మ సిద్ధాంతంపై ఆధారపడియున్నది. అంటే మంచిచేస్తే మంచి జరుగుతుంది. చెడుచేస్తే చెడు జరుగుతుంది. వానలు కురవకపోవటానికి మానవుల దుష్ట చేష్టలే కారణమని శాస్త్ర సిద్ధాంతం. దీనికి చిన్న ఉదాహరణ రామాయణంలో వుంది. రోమపాదుడు అంగదేశాన్ని పాలించే కాలంలో వానలు కురవలేదు. దానికి కారణం రాజ్యపరిపాలనలోని లోపం అని మహర్షులు చెప్పారు. విభాండకముని కుమారుడు ఋష్యశృంగుని తీసుకొని వస్తే వానలు కురుస్తాయి అన్నారు. రోమపాదుడు ఋష్యశృంగుని రప్పించగా వానలు కురిశాయి.

ఈనాడు రాజులు లేరు. కాని వారి స్థానంలో ప్రజాప్రతినిధులు పాలిస్తున్నారు. వారి పాలనలోని లోపమే కరువు కాటకాలకు కారణమని శాస్త్ర సిద్ధాంతం.

అయితే ఇప్పుడు ఏం చేయాలి అనేది ప్రశ్న.

ఇప్పుడు అట్టి మహర్షులు లేరు. ఋష్యశృంగులు లేరు. అయినప్పటికి ప్రతి సమస్యకు పరిష్కారం వుంటుంది. ఇలాంటి సమయంలో చేయదగిన ప్రతీకార చర్యను మహర్షులు తెలియజేశారు. ఆ విషయాలు వేద శాస్త్రాలలో చెప్పబడ్డాయి. శివాలయాలలో సహస్ర ఘటాభిషేకం చేస్తే వర్షాలు తప్పక కురుస్తాయి అనేది భారతీయుల ప్రత్యక్ష ప్రమాణం. విరాటపర్వం పురాణం చెప్పినా వర్షం కురుస్తుంది. నీటిలో నిలువబడి వరుణజపం చేసినా వర్షం కురుస్తుంది.

కాని వీటిని ఎవరూ పట్టించుకోవడంలేదు. ఎందుకని? దేశనాయకులకు ఈ విషయాలు తెలియవు. తెలిసినా నమ్మకం లేదు. అందుకని వారు ఈ పని చేయరు. దేవాలయ పాలకులున్నారు. దేవాలయాలకు పూర్వులిచ్చిన కోట్లకొలది రూపాయల ఆస్తులున్నాయి. ఎందరో అధికారులు వాటిపై ఆధారపడి బ్రతుకుతున్నారు. వారికి శ్రద్ధ లేదు. ఈ మధ్య మధ్యప్రదేశ్‌లో అభిషేకాలు చేయగా వర్షాలు కురిసాయి.

అందరూ పట్టించుకోకపోయినా సంస్కృతిపై నమ్మకముగల పెద్దలున్నారు. వారు ఈ విషయాలు చెప్పరు ఎందుకని? చెపితే వినేవారు లేరు. తమ మాట వ్యర్థమైపోతుంది. ఈ సమయంలో దేశ ప్రేమికులయిన పత్రికాధిపతులే ఈ విషయాలను లోకానికి తెలియజేయాలి. దేశాన్ని, ప్రజలను రక్షించాలి. అలా చేస్తే కుండపోత వర్షాలు కురుస్తాయి. నీటి ఎద్దడి వుండదు. రాష్ట్రాల మధ్య నీటి తగాదాలు సమసిపోతాయి.

## 3. పశుపక్ష్యాదులకు ఉత్తమగతులు కలుగవా?

పశుపక్ష్యాది సమస్త జీవులకంటె మానవులు ఉన్నతులు అని అందరు శాస్త్రకర్తలు, మహర్షులు, యోగులు, సిద్ధులు చెప్పుచున్నారు. మహత్తరమైన తపస్సు చేసిననేగాని మానవజన్మ లభించదని మహాత్ములు చెప్పుచున్నారు. వారు చెప్పిన మాట అటుల వుంచి అనుభవములో చూచినప్పటికిని మానవ జన్మ సర్వోత్కృష్టమని తెలియును. అందులకు కారణము సృష్టియందలి సమస్త జీవరాశియు మానవునికి సేవ చేయుటకు తగిన విధముగ సృష్టించబడినది. సృష్టికర్తయైన భగవంతుడు, మానవుడు పూర్వజన్మయందు చేసిన పవిత్ర కార్యములకు సంతసించి ఈ మానవ జన్మను యిచ్చియుండవచ్చును అని తలంచవలసి యున్నది.

భగవంతుడు గజాది స్థూల శరీరధారులను అశ్వాది యుద్ధ సాధనములనుగాక నిత్యము జీవనాధారములయిన గోజాతిని గాడిదలను

చోరులనుండి రక్షణ పొందుటకు శునకజాతిని మలమూత్రములను శుద్ధి చేయుటకు సూకర జాతిని యజ్ఞసాధనములయిన మేషములను సృష్టించెను. ఈ విధముగ ఆలోచించినచో ప్రతి జీవియు మానవుని యుపకారముకొరకే సృష్టించెనని తెలియును. అందులకు కారణము భగవంతునికి మానవునిపై గల దయ గావచ్చును. లేక అతడు పూర్వ జన్మమునందు చేసిన పుణ్యము కావచ్చును. ఇది యంతయు అనుమాన ప్రమాణముచేత సిద్ధించును.

ఇంతటి పుణ్యము చేసి జన్మించిన మానవునికిగూడ ఉత్తమ లోకములు గలుగుటకు శాస్త్రకారులు ఎన్నియో విధములను తెలియ జెప్పిరి. ఉత్తమగతులు కలుగుటకు దానధర్మములు, తీర్థయాత్రలు, వ్రత నియమములు, శుష్కోపవాసములు, దహన సంస్కారములు, శ్రాద్ధాదులు ఆచరించవలయును. అసత్యము చెప్పరాదు. అందరిని హితబుద్ధితో చూడవలయును. ఈ విధముగ శాస్త్రకారులు ఉత్తమగతులు పొందుటకై మానవులకు చెప్పిన ధార్మిక విషయములు అనంతములు.

ఎంతయో పుణ్యము చేసి పుట్టిన మానవులకే ఉత్తమగతులు పొందుటకు కష్టసాధ్యములయిన ఆచరణలు చేయవలసియుండగా ఏ వ్రతాదులు పుణ్యకార్యాలు చేయుటకు కూడా తెలియని మూఢజాతి పశుపక్ష్యాదులకు ఉత్తమగతులు కలుగునాయని ప్రశ్నించుట అనుచిత మనిపించును.

నిజమే. అనుచితమే. సందేహములేదు. అయితే ప్రశ్న వచ్చిన తర్వాత సమాధానము వుండవలయును. పొందునని చెప్పవచ్చును. పొందవని చెప్పవచ్చును. ఏది చెప్పుటకయినను తగిన కారణము పరిశోధించక తప్పదు.

పుణ్యపాప విషయములందు ప్రసిద్ధమయిన ధర్మశాస్త్ర శ్లోకమొకటి వున్నది. కర్తాకారయితాచైవ ప్రేరకశ్చానుమోదకః సుకృతే దుష్కృతే చైవ

చత్వారః సమభాగినః అని. ఏదయినా సత్కార్యము చేయవలసినపుడు సహకరించువారు నలుగురుందురు. చేయువాడు, చేయించువాడు, చేయమని చెప్పినవాడు, చేసినది బాగున్నదని మెచ్చుకొనువాడు. వీరందరికి పుణ్యకార్యములో సమానమయిన భాగముండునని శాస్త్ర వచనము.

భూమిపై జన్మించిన మానవులు చేయు ప్రతి పుణ్యకార్యమునకు మనము చెప్పుకొనిన పశుపక్ష్యాదులే కారణము. మానవుడు పుణ్యకార్యము చేయవలయునన్న అతని శరీరము దానికి తగినటుల పుష్టిగా ఆరోగ్యముగా అనుకూలముగా వుండవలయును. ఆ విధముగా వుండుటకు చక్కని యాహారము లభించవలయును. ఆ యాహారము భూమినుండి లభించును. ఆ విధముగ లభించుటకు వృషభములు భూమిని దున్ని యాహారము పండించి మనకు అందజేయవలయును. ఆహారము లేక ఏ ప్రాణియు జీవించలేదు. అటులనే గోజాతియు పాలు పెరుగు, నేయి, మజ్జిగ అందజేసి ప్రాణములు నిలుపుచున్నవి. ప్రాణములు నిలచిననే గదా మానవులు పుణ్యకార్యములు చేయగల్గినది. ఆ విధముగా ప్రాణరక్షణకు కారణమయిన పశువులకు మన పుణ్యములో నాలుగవ భాగము లభించవలయును. తప్పదు. అటులనే రాజులు రాజ్యపాలనచేసి స్వర్గలోకమును పొందుదురని రామాయణము చెప్పుచున్నది. రామో రాజ్యముపాసిత్వా బ్రహ్మలోకం ప్రయాస్యతి ఇతి . రాజులు ప్రజలను చక్కగా పరిపాలించుటకు వారికి తగిన శక్తిని ఇచ్చునవి వారి సైన్యములు అనగా రథములు అశ్వములు, ఏనుగులు మొదలయినవి. వీటి ఆధారముతోనే రాజులు యుద్ధముచేసి వీరస్వర్గము పొందుచున్నారు.

మనము శిబి చక్రవర్తి కథను గొప్పగా చెప్పుకొందుము. అతడు పావురమును రక్షించుటకు తన శరీరమును త్యాగము చేసెను. మరి ఎన్నియో జీవులు తమ శరీరమును ఆహారముగా ఇచ్చి మానవులను బ్రతికించుచున్నవి. ఈ విధముగ ఆలోచించినపుడు మానవుడు తన

జీవితమునచేయు పుణ్యకార్యములన్నిటికిని పశుపక్ష్యాదులు ఆధారమగు చున్నవి. అందువలన వాటికి మానవుల పుణ్యములో లేశమాత్రమయిన లభించునని చెప్పక తప్పదు. అయితే దీనికి యుక్తియే ప్రమాణమా? శాస్త్ర ప్రమాణమున్నదా? అని ఆలోచన కలుగును.

మనము నిత్యము అభిషేకము చేయు నమక చమకములయందు ఈ విషయము స్పష్టముగా గలదు.

శ్వభ్యః శ్వపతిభ్యశ్చనమః అనియున్నదిగదా. ఈ రచన చేయుట యందలి లక్ష్యము మనకు ఏదియయినా పశువు కన్పించినపుడు దానికి నమస్కారము చేయుటయేగాక ఫలముగాని తోటకూరకాడగాని దానికి అందజేసినపుడు మనము మానవులము అని తలచుటకు అవకాశము లభించును.

## 4. ఏదిగొప్ప? ధనమా-జ్ఞానమా?

ఏమిటి ఈ పిచ్చి ప్రశ్న? అందరూ ధన సంపాదన కోసమే చదువు తున్నారు. ఉద్యోగాలు చేస్తున్నారు. వ్యాపారాలు చేస్తున్నారు. విదేశాలకు వెళుతున్నారు. అటువంటి సమయంలో ధనమా, జ్ఞానమా ఏది గొప్ప? అని విచారించటం చొప్పదంటు ప్రశ్నలాంటిది అవుతుంది. నిజమే ఈ ప్రశ్న ఏమీ అనుకూలంగా లేదు.

కావచ్చు. కాని ప్రతివారికి ప్రతి విషయాన్ని తమదయిన తెలివియనే త్రాసులో తూచుకొని నిశ్చయించుకోవటంలో దోషం లేదుగదా! అందరూ చేస్తున్నారు కాబట్టి మనం చేద్దాము అనుకోవటం తెలివిలేనివారి పని అని కాళిదాస మహాకవి మూఢః పరప్రత్యయనేయ బుద్ధిః అని మూఢుని లక్షణంగా చెప్పాడు.

అయితే ఇంతకూ ఏమంటారు. చెపుతా వినండి. గీతాచార్యుడయిన శ్రీకృష్ణ పరమాత్మగూడ యానిశా సర్వభూతానాంత స్యాం జాగర్తిసంయమా

అని చెప్పారు. అనగా అందరూ గాఢాంధకారంలో మునిగియుంటె యోగిమాత్రము తెలివిగలిగియుంటాడు అని. అందరూ చెప్పారు అనిగాక మనకు మనంగా వివేకంతో ఆలోచించుకోవలసి వుంటుంది.

ముందుగా ధనానికి జ్ఞానానికి యుండే లక్షణాలు తెలుసుకొని తరువాత ఏది గొప్పదో పరిశీలించాలి. ధనం చేత వస్తు వాహనాలను సంపాదించుకుంటాము. జ్ఞానంచేత లోక స్వభావం సృష్టి రహస్యం, సమాజ క్షేమము మొదలయినవి తెలుసుకుంటాము. ఉదాహరణకు రాజరాజ నరేంద్రుడు శక్తి పరాక్రమాలు కుదువపెట్టి రాజ్యం చేశాడు. కాని ఆ రాజ్యం కొద్దికాలంతరువాత నశించింది. నన్నయ తెలివి కుదువ పెట్టి భారతం వ్రాసాడు. అది యిప్పటికీ నిలచి వుంది. విద్యారణ్యస్వామి ధనము సమకూర్చి విజయనగర సామ్రాజ్యస్థాపన చేయించాడు. - కాని అది నశించింది. తన జ్ఞానశక్తితో, వేదాలకు భాష్యాలు వ్రాసాడు. అవి యిప్పటికీ నిలచి వున్నాయి. అందుచేత ధనశక్తికంటె జ్ఞానశక్తి ఎక్కువ అని శాశ్వతమని తెలుస్తుంది.

ఇంకొక ముఖ్య విషయం. ధనం నేరుగా సుఖాన్ని యివ్వలేదు. పరంపరగా యిస్తుంది. అంటే ధనమువలన మరియొక వస్తువును సంపాదించి సుఖమును పొందాలి. ధనముతో ఇల్లు కొనవచ్చు. అది సుఖాన్ని యిస్తుంది. వస్త్రాలు కొనవచ్చు. అవి శరీరానికి అలంకారంగా వుంటాయి. మంచి భోజనం చేయవచ్చు. అది ఆకలి తీరుస్తుంది. ఈ విధంగా ధనం సుఖసాధనం అవుతుందేగాని సరాసరి సుఖాన్ని యివ్వలేదు. జ్ఞానం అలాంటిదికాదు. అది సాక్షాత్తుగా ఆనందాన్ని కలిగిస్తుంది. అంటే ఎవరయినా ఒక మంచి విషయాన్ని చెపితే విని ఆనందిస్తాము. అంతేగాని ఆ చెప్పిన మాటవలన కలిగిన జ్ఞానాన్ని ఆధారం చేసుకొని మరియొక వస్తువును సంపాదించనవసరం లేదు. ఇంతమాత్రంచేత అసలు విషయం తేలికగా తెలియదు.

మనం ధనవంతులం. మన డబ్బంతా ఏ బ్యాంకులోనో డిపాజిట్టు చేసాము. రాత్రి సమయంలో ప్రమాదకారణంగా ధనం అవసరమయింది. అప్పుడు ఆ డబ్బు చేతికిరాదు. మన అవసరం తీరదు. అంటే డబ్బు వున్నా సుఖం దక్కలేదు. ఒక పెద్దమనిషి బజారులో వెళుతున్నాడు. వర్షం వచ్చే సూచన కనిపించింది. గొడుగు కొనాలనే బుద్ధిపుట్టింది. ఒక కుర్రవాడు గొడుగులు అమ్ముతున్నాడు. వాడి దగ్గరకు వెళ్ళి బేరం చేసాడు. నానా అవస్థపడి ఇరువది రూపాయలు తగ్గింపుగా బేరం కుదిర్చాడు. గొడుగు తీసుకున్నాడు. డబ్బుకోసం జేబులో చేయి పెట్టాడు. డబ్బులేదు. ఎవరో కొట్టేశారు. అదే పిల్లవాడితో చెప్పాడు. వాడు నమ్మలేదు. అందరూ ఇలాగే అబద్ధాలు చెబుతారు. ఆకాడికి బేరం చేయటం ఎందుకు అన్నాడు. పెద్దమనిషికి విసుగూ చిరాకూ కలిగాయి. పాపిష్ఠి డబ్బు, నాకు అవమానం కలిగించింది అనుకున్నాడు. జ్ఞానానికి ఇటువంటి బాధలేదు. అది ఎల్లప్పుడూ మన తోటే వుంటుంది. మనలను విడిచిపోదు. ఎల్లప్పుడూ ఆనందాన్ని కలిగిస్తుంది.

మీరు చెప్పేది మాకర్థంకాలేదు. జ్ఞానం యిచ్చే ఆనందం ఎలా వుంటుందో వివరించండి. చెపుతాను వినండి.

రామాయణం నిండా కావలసినన్ని విశేష విషయాలు వున్నాయి. సీతాదేవి హనుమంతునితో రాముని స్వభావాన్ని యిలా వివరించి చెప్పింది.

**దద్యాన్న ప్రతి గృహ్ణీయాన్న బ్రూయాత్ కించి దప్రియమ్.**
**అపి జీవిత హేతోర్వా రామః సత్య పరాక్రమః.**

దీని భావము. రాముడు యిచ్చేవాడేగాని పుచ్చుకొనేవాడు గాడు. ఇతరుల మనసుకు బాధ కలిగించే ఏ చిన్నమాట అయినా అనడు. ఆయన పరాక్రమం సత్యమయినది. పొల్లుపోదు, వ్యర్థముగాదు. ప్రాణాపాయం కలిగించినా ఆయన ఈ వ్రతం వదలడు.

అయితే వాల్మీకి మహర్షి యిచ్చట ఒక రత్నాన్ని బంగారు పట్టు వస్త్రంలో దాచియుంచాడు. అది రత్నంగదా, విలువగలదానిని విలువ గలచోటనే దాచాలి. మరియొక కారణంగూడా వుంది. విలువగల వస్తువు విలువ తెలియనివారికి అందగూడదు. అందితే దానిని వ్యర్థపరుస్తాడు. అందుకే దాని విలువ తెలిసినవారికోసం చక్కగా భద్రపరిచాడు.

ఏమిటా రత్నం. సత్యపరాక్రమః అంటే నిజమయిన పరాక్రమము అనియేగాదు. సత్యమే ఆయనకుగల పరాక్రమము. అంటే కార్యసాధనకు శరీర శక్తి ధనుర్బాణాలు ఉపయోగించిన విధంగా ఉపయోగించే సత్యమనే శక్తియొకటి యున్నది. ఆ శక్తి ఆయన దగ్గర యున్నది. అదియే ఆయన శక్తి. లక్ష్మణుడు ఇంద్రజిత్తును వధించు సమయమున బాణమును విడచుచు రామోయది ధర్మాత్మా సత్యసంధః అని ప్రతిజ్ఞచేసెను.

ఇది మన విషయం. ఇచ్చట వాల్మీకి మహర్షి ప్రయోగించిన సత్య పరాక్రమః అను వాక్యములోని, అంతరార్థము తెలిసినచో ధర్మాత్మునికి రసికునకు కావ్యమర్మజ్ఞునకు కలిగెడి ఆనందము మితిలేనిది. ఏ ధనముతోను కొనజాలనిది.

అందుకే ప్రాచీనులు ధనమునకంటె జ్ఞానమునకే ప్రధమస్థాన మిచ్చి ఉన్నతులయినారు.

ఆధ్యాత్మిక జ్ఞానమే సుఖశాంతులకు ఆధారము.

## 5. ఏది సత్యం? ఏది అసత్యం?

మనము కన్నులతో చూచినదియు చెవులతో విన్నదియు సత్య మగును. దానికి వ్యతిరేకమయినది అసత్యమనియు సామాన్యముగా చెప్పవచ్చును. అంటే మన కనులకు కనిపించు భూమి, దానిపై సంచరించు జీవరాశులు, ఆకాశముపైగల సూర్యచంద్రులు, నక్షత్రములు మొదలయిన వానిని సత్యవస్తువులని చెప్పవచ్చును. ఈ కనిపించిన వానిని ఆధారముగ

చేసుకొనియే ధర్మములు చెప్పబడినవి. ఆ ధర్మములలో సత్యవాక్య పరిపాలన గూడ ముఖ్యమయినది.

ఈ లోక క్షేమమంతయు ఆర్థిక విధానముపై ఆధారపడియున్నది. ధనమూల మిదం జగత్ అని శాస్త్రము. అందుచేతనే అర్థమును పురుషార్థములలో చేర్చిరి. ఆయార్థిక విధానము సత్యవాక్యముపై ఆధారపడియున్నది. అందులకే సర్వం సత్యే ప్రతిష్ఠితం అనే వాక్యం పుట్టింది. సత్యాత్ పరో దర్మోనాస్తి. నాస్తి సత్య సమం తపః సత్యం వద। అనే వేదవాక్యములుగూడ సత్యమహిమను వివరించినవి. సత్యమహిమను తెలియజేయు కథలు ఎన్నియో ప్రచారములో వున్నవి. బలిచక్రవర్తి వామనుని వలన తనకు నాశనము కలుగునని శుక్రాచార్యుడు చెప్పి నప్పటికిని సత్యమును వదలరాదు అని తలచి వామనునికి మూడు అడుగుల భూమిని దానము చేసెను. సత్య హరిశ్చంద్రుడు సత్య మహిమను చాటిచెప్పెను. మానవులేగాక పశువులు కూడా సత్యమును పాలించునని చెప్పు గో వ్యాఘ్ర సంవాదము అను కథ పురాణములలో ప్రసిద్ధమయినది. ఈ విధముగ సత్య మహిమ అనంతమని మనకు తెలియచున్నది.

అసత్యము చెప్పుటవలన కలుగు నష్టమును తెలియజెప్పుటకు పిల్లలకు చిన్నకథను వినిపింతురు. గొఱ్ఱెలను కాయుచున్న పిల్లవాడు పరిహాసమున తోడెలు వచ్చెనని అరచెను. పెద్దలు పరుగెత్తుకొని వచ్చిరి. కాని తోడేలు లేదు. ఇటులనే రెండు మారులు జరిగెను. మూడవ తడవ నిజముగా తోడేలు వచ్చెను. కాని ఎవరును సహాయమునకు రాలేదు. తోడేలు మేకలను తినెను. ఈ కథ అసత్యమువలన కలుగు నష్టమును తెలియజేయుచున్నది. ఇవియన్నియు పాతకథలు.

మన నిజ జీవితమున సత్యమునకు కల విలువ ఎంతో తెలుసుకొన వలయును. మన అవసరమునకు పక్కయింటివారివద్ద పది రూపాయలు అప్పు తీసుకొందుము. వెంటనే ఈయగలమని చెప్పెదము. కాని

నిర్లక్ష్యముచే ఈయము. మరల అవసరమయినపుడు అడిగి తీసు కొందుము. కాని ఈయము. మూడవ తడవ అవసరమయినపుడు వారు ఈయరు. మనకు యిబ్బంది కలుగును.

ఇటులనే ప్రతి విషయమునందును సత్యమువలన లాభము అసత్యమువలన నష్టము వచ్చుననియు తలంచవలెను.

సామాన్యులమయిన మనమందరము ఈ విషయము మరచినచో జీవితమే దుఃఖదాయకమగును. కొందరు ఈ విషయము గుర్తించక ఇతరులను నమ్మించి మోసము చేసితిమిగదాయని తమను తాము గొప్పగా భావించుకొందురు. కాని అది వారికి చేటుతెచ్చునని గుర్తించలేరు. అంతియేగాక అందరు నిజము చెప్పుచున్నారా? అబద్ధములు ఆడుటలేదా. మనమాడిన తప్పా వారు ఆడిన తప్పుకాదా అని సర్దుబాటు చేయుదురు. కొందరు ఇది కలికాలము అబద్ధము ఆడకపోతే జీవితమే గడవదు అని కాలముపై తమ తప్పును పెట్టుదురు. అది సరిగాదు. దానివలన మనకే నష్టమని సత్యము తప్పినచో లోకమునకు చేటు కలుగుననియు గుర్తించవలయును.

ఇది యంతయు లోకము సత్యమని నమ్మినవారిని గురించి చెప్పబడినది.

దీనికి భిన్నమయిన వాదన యొకటి యున్నది. అది సత్యమయినది. వేదములు, మహర్షులు, ఆచార్యులు అంగీకరించినది. అది జగన్మిధ్యా వాదము. వేదాంత శాస్త్ర పరిశోధకులు చాలా మొండివారు. అందరు చెప్పింది ఒప్పుకోరు. తాము చెప్పింది అందరూ వినాలి అంటారు. ఏది కనిపించుచున్నదో అది అసత్యం ఏది కనిపించదో అది సత్యం. అంటే ఈ ప్రపంచము లేదు. దానిని మీరందరు ఉన్నది అనుకుంటున్నారు. కాని అది అసత్యం. ఆ ఉన్నది సత్యమయితే అది యేది? అదే ఈ సృష్టికి

కారణమయిన బ్రహ్మ. అది మాత్రమే సత్యం.

ఏమిటి ఈ వింత వాదన. కనిపించే దానిని అసత్యమనటం కనిపించని దానిని సత్యమనటంలోని భావనయేమి?

మనము కొన్ని కష్టసుఖాలు నిత్యము అనుభవిస్తున్నాముగదా. వీటివలన బాధపడుచున్నాము. అవి పోవాలంటే ఈ విషయం తెలుసుకోక తప్పదు. చిన్న పిల్లవానివలె ఒక వస్తువు వస్తే ఆనందం పొందుతాము. పోతే బాధపడతాము. ఈ రెండూ లేని స్థితి ఒకటి వుంది. అది మనకు తెలుసా? తెలియకపోతే తెలుసుకోవాలి.

ఈ సృష్టికి మూల కారణమయినవాడు నిర్గుణ పరబ్రహ్మ. అంటే ఆయన దగ్గర దుఃఖకారణములయిన సత్త్వరజస్తమోగుణములు లేవు. అయితే ఆయన పెద్ద గారడీవాడు. ఆయన ఏమీ చేయడు. చేసినట్లే వుంటాడు. ఒక పెద్ద కర్మాగారంలో అందరిచేత పనిచేయిస్తూ ఏమీ చేయని యజమానివలె వుంటాడు. ఆ యజమాని ఏమీ చేయకపోయినా ఆయన వుంటే అందరూ భయంతో పనిచేస్తారు. ఆయన లేకపోతే ఎవరూ పనిచేయరు.

అలాగే ఆయన తన దగ్గరగల మాయయనే శక్తిచేత అంతా చేయిస్తాడు. ఆయనమాత్రం చేయడు. అదియే లేని దానిని ఉన్నట్లుగా భ్రాంతిని కలిగిస్తుంది. మనము దానికి లోనవుతాము. దానివలన ఒక క్షణం ఆనందం మరోక్షణం బాధ అనుభవిస్తాము. నిజానికి ఇది అంతా మాయ అని తెలిసినపుడు మనకు సుఖము దుఃఖము కలుగవు.

మీరు ఆ మాయకంటె మరీ మాయ చేస్తున్నారు. అది తెలియటమెలా అది తెలిస్తే సుఖదుఃఖాలు వుండవని తెలియటమెలా?

ప్రతిదానికి అనుభవమూ శాస్త్రము ఆధారములు. ముందర శాస్త్ర వచనం వినండి. తరువాత అనుభవించండి.

గీతాశాస్త్రం అంటుంది. ద్వంద్వాతీతో భవార్జున అని. సుఖదుఃఖాలకు అతీతుడవుకమ్ము. అంటే ఆ స్థితిఒకటి వుందన్నమాట. అందుకే గీతాచార్యుడు చెప్పాడు. లేనిది చెప్పడుగదా.

శంకరాచార్యులవారు అంటాడు. యస్య బ్రహ్మణి రమతే చిత్తం నందతి నందతి నందత్యేవ. రామాయణంలో సీతాదేవి అంటుంది : యేషాం ప్రియాప్రియే నస్తః నమస్తే షాం మహాత్మనాం అని. కాబట్టి ఆ స్థితి ఒకటి వుంది. అది పొందటమెలా అన్నది ప్రశ్న.

ఈ శరీరంలో ఎన్నో రహస్యాలున్నాయి. కాళ్ళు చేతులు, రక్తము, మాంసము మొదలయినవేగాక పంచ ప్రాణాలు పంచేంద్రియాలు, మనస్సు, బుద్ధి మొదలయినవి. ఇవి అన్నీ మనవి కాదంటుంది శాస్త్రము. అంటే మన శరీరం దగ్ధమయితే మన ప్రాణాలు దగ్ధం కావుగదా. ఎందుకని. అంతకు పూర్వమే అవి వెళ్ళిపోయినవి. వాటిని పట్టుకొని ఎవరు దగ్ధం చేస్తారు. అటులనే మనస్సు బుద్ధి, ఇంద్రియములు మొదలయినవి. మన శరీరంలాగే మన ఇంద్రియాలు కూడా మనవి కావు. అవి మనకు ముసలివానికి చేతికర్రలాగా మనకు ఉపయోగ పడతాయి. కర్రపోతే మనిషి నడవలేడు. కాని కర్ర తానుగాడు. అటులనే ఇంద్రియాలు లేకపోతే పనిజరుగదు. కాని ఇంద్రియాలు మనంకాదు అని తెలుసుకుంటే మనం మనలను తెలుసుకున్నట్లు.

సత్యం అంటే ఆ నిర్గుణ బ్రహ్మ. అసత్యం ఈ ప్రపంచము. ముందు చెప్పిన సత్యమే దీనికి కారణం.

లోక వ్యవహార నిమిత్తం హరిశ్చంద్రాదులవలె ఈ ప్రపంచము సత్యమని తలచి వ్యవహరించాలి. దానిని వ్యావహారిక సత్యమంటారు. నిజానికి అది లేదు కాబట్టి అది అసత్యం. ఈ పరబ్రహ్మ ఆత్మనిత్యం. దీనిని పారమార్థిక సత్యం అంటారు. లోక వ్యవహార నిమిత్తం మొదటి దానిని అనుసరించాలి. ఆత్మోద్ధరణ నిమిత్తం రెండవదానిని అనుసరించాలి.

## 6. దేవుని దయ ఎటుల లభించును?

దేవుడు దయాసాగరుడని భక్తులు వేనోళ్ళ కొనియాడుచుందురు. అయితే ఆ దయ లభించుటకు ఏమి చేయవలయుననునది తెలుసుకొన దగిన విషయము.

మనము ఎవరితోనయినా స్నేహము చేయదలచినపుడు ముందుగా వారి విషయములను గురించి ప్రవర్తనను గురించి సదాచారమును గురించి ఉపకారబుద్ధిని గురించి తెలుసుకొందుము. ఆ విషయములు, మనకు నచ్చినచో వారితో స్నేహము చేయుటకు ప్రయత్నించెదము. ఆ ప్రయత్నములో ముందుగా వారి దగ్గరకు వెళ్ళి వారిని దర్శించి మనలను గురించి పరిచయ వాక్యములు చెప్పెదము. అటుపిమ్మట రెండు మూడు రోజులకు ఒకమారు కనిపించి వారి యోగక్షేమములు విచారించెదము. అటుపిమ్మట సమయము దొరికినపుడు ప్రతిదినము వెళ్ళుదుము. ఈ విధముగా స్నేహభావము పెరిగి ఒకరోజు తీరిక లేక వెళ్ళనిచో మన మనస్సునకు కొరతగా నుండును. ఈ విధముగా పెరిగిన స్నేహమువలన వారు మనకు మిత్రులగుదురు. మిత్రులనగా ఆపదనుండి రక్షించువారని యర్థము. మనకు ఏదయినా కష్టసమయము సంభవించునపుడు అడుగకుండగనే మనకు సహాయము చేయుదురు.

నాకు పాఠములను చెప్పుట కారణముగ ఒక యింటివారితో పరిచయము ఏర్పడినది. ఆ పరిచయము క్రమముగ స్నేహముగ మారినది. ఆ స్నేహ కారణమున ప్రతిదినము వారి యింటికి వెళ్ళుట అభ్యాసమయ్యెను. నేను ఏదియయినను పనికారణముగ వారి యింటికి వెళ్ళనిచో నాకు ఏదో ప్రమాదము జరిగియుండునని భయపడెడివారు. ఆ స్నేహము పది సంవత్సరములు జరిగెను. నాకు చెప్పకయే వారు ఎన్నియో యుపకారములు చేసిరి.

భగవంతుని విషయమునగూడ ఈ పరిస్థితియే యుండును. మనకు సమీపమునగల దేవాలయమును గురించి భక్తులు చెప్పు మాటలు వినుచుందుము. వినిన తరువాత అక్కడికి వెళ్ళవలయునని బుద్ధి కలుగును. ఆ పిమ్మట ఆ దేవుని దయవలన కష్టములు తొలగి సుఖపడినవారి చరిత్రలు తెలియును. మనకు కష్టములు లేనప్పటికిని అచ్చటకి వెళ్ళుటవలన భక్తులను చూచుటవలన ఆనందము కలుగును. క్రమముగ అచ్చటికి వెళ్ళుట అలవాటు అగును. ఆ యలవాటు కారణముగ ఒకసారి వెళ్ళనిచో అయ్యో మనము వెళ్ళలేకపోయితిమే యనిపించును. అనగా భగవంతుని విషయమున ఆరాటము పెరిగినదని యర్థము.

నెమలి గ్రామమున వేణుగోపాలస్వామి దేవాలయము గలదు. ఆ స్వామి భక్తుల కోరికలు తీర్చునని కష్టములు తొలగించునను ప్రసిద్ధి ఎక్కువయ్యెను. అది మారుమూలనున్న చిన్నగ్రామము. అయితేనేమి ప్రతిరోజు వందలకొలది భక్తులు వచ్చుచుందురు. దేవుని ఆదాయము లక్షలకు పెరిగినది. దేవాలయ నిర్మాణము పెరిగినది.

భక్తులు సేవించిన కొలది భగవంతునికి దయపెరుగును. దయ పెరిగిన కొలది భక్తులు పెరుగుచుందురు. కాబట్టి ప్రతివారు ముందుగ తమకు ఇష్టమయిన దేవుని ఏదో విధమున సేవించుటకు అలవాటు పడవలయును. మీ యింటగల దేవుని విగ్రహమునకుగాని పటమునకు గాని ప్రతిరోజు ఒక పూవు పెట్టుట, నమస్కారము చేయుట అభ్యసింప వలయును. అందరకు ప్రతినిత్యము ఏదియోయొక అవాంతరము వచ్చుచుండును. వాటిని తొలగించుటకు అందరిపై దయను కలిగించు బుద్ధిని ప్రసాదించవలసినదని ప్రార్థించవలయును. పూవులు లేనిచో దండము పెట్టుట నభ్యసింపవలయును. మీతోపాటు మీ ఇంటిలోని వారందరు అటులనే చేయుదురు. శాంతి లభించును. కష్టసమయమున ఏ దేవుని ప్రార్థించవలయును అను సందేహపడనవసరము లేకుండగ యిష్టదైవమును ఆశ్రయించవచ్చును.

అటులనే కొందరి యిండ్లయందు కులదేవతలుందురు. అనగా ఆ యింటివారు తరతరములనుండి ఆ దేవుని నమ్మి సేవించుచుందురు. అందువలన వారు తమ చిన్న కార్యక్రమ ప్రారంభ సమయమున పని సక్రమముగ జరుగుటకు కులదేవతను ప్రార్థింతురు. ఇంతియేగాదు. వంశపారంపర్యముగ పూజలందుకొనిన దేవతలు కాన మన యిండ్లను కొన్ని తరముల వరకు కాపాడుచుందురు. ఏదయినా కష్టసమయము వచ్చినపుడు స్వప్నమున కనిపించి కొన్ని సూచనలు చేయుదురు. దానివలన మన కష్టములు తొలగును. ప్రతిదినము మనకు తెలియకుండగనే భగవన్నామము స్మరించుట జరుగును.

అయితే మనకు అనేకమంది దేవతలు కలరు. శివుడు, కృష్ణుడు, పార్వతి, దుర్గ, వినాయకుడు, కుమారస్వామి మొదలయినవారు. ఏ దేవతను ఆశ్రయించవలయునను సందేహము కలుగును. మన పూర్వజన్మ వాసనల వలన సాంగత్యము వలన అనుభవమువలన గూడ మనకు ఒక దేవతపై ప్రీతి యేర్పడును. ఆ దేవతనే యిష్టదైవమందురు. అందరు దేవతలు అన్ని కోరికలు తీర్చగలరు. అయినప్పటికిని ఎప్పటికప్పుడు ఏదో ఒక దేవతను సేవించుట కాక ఒక దేవతపై భక్తిని నిలుపుటకు ప్రయత్నించవలయును. అప్పుడే మనకు తొందరలో ఫలసిద్ధి కలుగును. ఇది పెద్దల మతము. శంకరాచార్యులవారుగూడా ఏకో దేవః కేశవో వా శివో వా యని చెప్పిరి. రామదాసు, త్యాగరాజు, రామునియాశ్రయించిరి. మీరాబాయి కృష్ణుని యాశ్రయించెను. సతీ సక్కుబాయి పాండురంగని యాశ్రయించెను. రామదాసు చనిపోయిన తన కుమారుని రాముని దయవలన బ్రతికించుకొనెను.

ప్రస్తుత కాలమున అందరు ధనసంపాదనకు ప్రయత్నించుచున్నారు. ఆ విషయము గమనించిన మాతాజీ శివచైతన్య లక్ష్మీ అష్టోత్తర శతమును ప్రకటించి అందరకు వినియోగించుచున్నారు. కాబట్టి అందరు

తపోవనమును దర్శించి మాతాజీ వలన అష్టోత్తర శతమును గ్రహించి వారి యాశీర్వాదమునొంది. సుఖజీవనులు అగుదురుగాక యని యాశించుచున్నాను.

## 7. దేవుడు మానవుడు ఎందుకయ్యాట్ట?

భూలోకవాసులయిన మానవులందరు క్లేశదాయకములయిన పూజలు వ్రతములు చేసి వైకుంఠమునకు వెళ్ళవలయునని ఉబలాటపడు చుండగా వైకుంఠవాసి యయిన శ్రీమన్నారాయణుడు మానవ రూపమున భూలోకమున అవతరించవలసిన యవసరము ఏమి కల్గినదని సామాన్యుల సందేహం. అందులోనే చెప్పబడినదిగదా రాక్షస సంహార నిమిత్తం అవతరించాడని మరల సంశయం ఎందుకు అని ఎదురు ప్రశ్న. రాక్షస సంహార నిమిత్తం అవతారమెందుకు గజేంద్రుని పట్టిన ముసలిని చంపిన విధమున లేక హిరణ్యకశిపుని వధించిన నరసింహస్వామివలె అవతరించ వచ్చునుగదా. మానవుడై పుట్టి మానవుని వలె సంచరించి వనవాసము చేసి దుఃఖముల ననుభవించుట ఎందులకు అని చివరి ప్రశ్న.

దానికి సమాధానమే యిది.

వేదములన్నియు శబ్దరూపమున నున్న భగవత్స్వరూపములు. వానిని చైతన్యముగల భగవంతునివలె భావించవలయును. ధర్మశాస్త్ర గ్రంథములన్నియు వానిని అనుసరించినవే ఈ గ్రంథము లన్నియును మానవుని ప్రవృత్తిని గురించి చెప్పుచున్నవేగాని ఆ గ్రంథ విషయములను అనుసరించిన పురుషుని చూపించలేకపోవుచున్నవి. భగవంతుడు వేదముల ద్వారా మానవులకు శాసించిన శాసనములను ఎటుల అనుసరించవలయునో ప్రత్యక్షముగా చూపుటకే భగవంతుడు మానవావతారమును ధరించెను.

మనము హరిశ్చంద్రుని నాటకము చదివినప్పటికంటె నాటకమును

చూచినప్పుడు తన్మయులమగు చుందుము. అనగా హరిశ్చంద్రుని పాత్రలో లీనమగుచుందుము. అటులనే ధర్మశాస్త్రములను చదివినప్పటికంటె రామాయణమును చదివినపుడు రాముని పాత్రలో లీనమగుదుము. అనగా రాముని స్వరూపము మనలో చేరును. అది మనకు ఆనందముతోపాటు సద్బుద్ధిని ప్రసాదించును. అందులకే పూర్వులు ప్రతిదినము రామాయణమును పారాయణము చేసిరి.

రాముని పాత్రలోగల అన్ని విశేషములు చెప్పుట సాధ్యముగాదు. ఒకటి రెండు మాత్రము చూపుదును.

రాముని జీవితములో పూర్తి మార్పు తెచ్చినది శ్రీరామ వనవాసము. ఈ ఘట్టమును వాల్మీకి మహర్షి కన్నులకు కట్టినట్లు చూపెను.

రాముడు పట్టాభిషేకమునకు సంసిద్ధుడయిన సమయమున సుమంత్రుడు వచ్చి దశరథుడు పిలుచుచున్నాడని చెప్పెను. వెంటనే రాముడు కైక గృహమునకు వెళ్ళెను. దుఃఖముతో నిండియున్న తండ్రి పాదములకు పిమ్మట కైక పాదములకు నమస్కరించెను. తన తండ్రి యింతటి దుఃఖమును పొందుటకు కారణమేమని కైకనడిగెను. కైక యిటుల చెప్పెను : "నీ తండ్రికి ఎటువంటి వ్యాధియు లేదు. నీకు అప్రియమును కలిగించు మాట చెప్పుటకు భయపడుచున్నాడు. నీ తండ్రి చెప్పినటుల చేయుదునని మాట యిచ్చినచో నీకు విషయమంతయు చెప్పెద"ననెను. ఆ మాటలకు రాముడు మిక్కిలి బాధపడి "నేను తండ్రి చెప్పినచో అగ్నియందు ప్రవేశింతును. విషము తిందును. సముద్రములో ప్రవేశింతును. తండ్రి మాట అనుసరింతునని వాగ్దానము చేయుచున్నాను. అబద్ధము చెప్పువాడనుకాను. నాకు విషయము చెప్పుమనెను". కైక యిటుల చెప్పెను : "నీ తండ్రి – నాకిచ్చిన మాట ప్రకారము నీవు పదునాలుగు సంవత్సరములు అరణ్యవాసము చేయవలయును. భరతుడు నీ స్థానమున అయోధ్య పాలించును".

ఈ మాట వినిన రాముడు దుఖమును పొందలేదు. మనస్సున వ్యాకుల పడలేదు. అతడు మహానుభావుడుకదా!

మరణ సదృశమయిన మాట వినియు రాముడు బాధపడలేదు. ఇటుల యనెను. నేను నారచీరలు ధరించి యడవికి వెళ్ళెదను. నేను, సీతను రాజ్యమును, ధనమును, ప్రాణములనుగూడ భరతునికొరకు ఇవ్వగలను. నన్ను ఒక్క విషయము బాధించుచున్నది. భరతుని పట్టాభిషేక విషయము నా తండ్రి నాకు స్వయముగా చెప్పలేదు కదాయని.

ఇందలి తాత్పర్యము. ఆయన స్వయముగా చెప్పినచో మిక్కిలి సంతోషము కలిగెడిది. వెంటనే భరతుని పిలిపించుము. అందులకు కైక సంతసించి నీవు ఆలస్యము చేయకుము. సిగ్గుచే నీ తండ్రి మాటలాడుట లేదు. అనుచు మన హృదయమునందలి నాడులను పైకి లాగిన విధమున ఇటుల హెచ్చరించెను.

యావత్త్వం న వనం యాతః పురాదస్మాద తిత్వరమ్

పితాతావన్నతేరామ స్నాస్యతే భోక్ష్యతేపివా

నీవు పురము నుండి బయటికి వెళ్లనంతవరకు నీ తండ్రి స్నానము చేయడు, భోజనము చేయడు.

అంతటి భయంకరము అయిన మాటవిని రాముడు మన మనస్సు లాగుచున్నవానివలె యిటుల యనెను.

నాహమర్థపరోదేవి లోకమావస్తుముత్సహే

విద్ధి మా మృషిభిస్తుల్యం విమలం ధర్మమాస్థితమ్

నేను ధనాశగలవాడనుగాను. ఇచ్చట వుండుటకు ఇష్టపడను. ఋషులతో సమానుడను. నిర్మలమయిన ధర్మమును ఆశ్రయించినవాడను.

ఈ మాటలు వినినచో ఎవరి హృదయము ద్రవీభవించి కన్నీరు కార్చదు. తండ్రి చెప్పకపోయినప్పటికీ నీవు చెప్పినను నేను అరణ్యమునకు వెళ్ళగలను.

ఇంతకు పూర్వము అంతయు తనదియనుకొనిన రాముడు త్యాగము చేయతగిన సమయమున తన నిస్పృహత్వమును ఇటుల తెలియజేసెను.

తన పట్టాభిషేక నిమిత్తము సిద్ధము చేసిన నీటితో నిండిన సువర్ణ భాండములను చూచి లక్ష్మణునితో ఇటుల యనెను.

సౌమిత్రే యోఽభిషేకార్థే మమ సంభార సంభ్రమః
అభిషేక నివృత్త్యర్థే సోఽస్తు సంభార సంభ్రమః

ఓ లక్ష్మణా నా పట్టాభిషేక నిమిత్తము ఈ భాండములన్నియు సిద్ధము చేయబడినవి. వీటితో నేను వనవాస నియమార్థము దీక్షాస్నానము చేసెదను. మరల యిటల యనెను. ఇవి యన్నియు రాజసేవకులు సిద్ధముచేసినవి అనగా రాజుగారివి. వీటితో నాకేమిపని. నేను స్వయముగా నీరుతోడుకొని స్నానముచేసి వనవాసదీక్ష పూనెదను.

ఏభిరేవఘటైః సర్వై రభిషేచన సంభృతైః
మమ లక్ష్మణ తాపస్యే వ్రత స్నానం భవిష్యతి
అథవా కిం మమైతేన రాజద్రవ్య మయేనతు
ఉద్ధృతం మే స్వయం తోయం వ్రతాదేశం కరిష్యతి

సుఖదుఃఖే సమేకృత్వా లాభాలాభౌ జయాజయౌ అని గీతాచార్యుడు చెప్పిన విధమున ఆచరించి చూపించినవాడు రాముడు. ఈ విధముగ ఆచరించి చూపుటకే దేవుడు మానవుడయ్యెను.

ఎన్నియో విశేషములు ఉన్నవి. చెప్పుటకు సమయము చాలదు.

## 8. దేవతలు ఎటువంటివారు వారి ప్రవృత్తి ఎటువంటిది?

వేదశాస్త్రములయందు పురాణములయందు మహర్షుల వాక్యముల యందు దేవతల ప్రస్తావన అధికముగ వున్నది. దేవతలందరు సర్వ మానవులకంటె అధికమయిన శక్తి సామర్థ్యములు గలవారువారు. తమను

ఆశ్రయించిన వారికి వరములను యిచ్చి రక్షింతురు. అది వారి ప్రవృత్తి. వారు మనస్సుచే సృష్టియంతయు వ్యాపించి యుందురు.

భూలోకమున గల మానవులను మనము చూచుచున్నాము. వారికి స్థిరమయిన నివాసముండును. అయితే వారు తమ అవసరముననుసరించి సర్వ ప్రదేశములయందు సంచరించుచుందురు. అచ్చట అవసరములయిన పనులు చేసి మరల తమ స్థానమునకు చేరుచుందురు. అటులనే దేవతలకు కూడా తమదైన నివాసస్థానముండును. వారు అవసరము ననుసరించి యంతట సంచరించుచుందురు.

విష్ణువు వైకుంఠమున నుండును. పరమశివుడు కైలాసమున నుండును. బ్రహ్మ సత్యలోకమున నుండును. శక్తి స్వరూపిణియయిన జగదంబ మణిద్వీపమున నుండును. ఈ విషయములు పురాణములందు చెప్పబడినవి. మనకు వలెనే వారికి చిన్న చిన్న పనులు నిర్వహించుటకు సేవకులుందురు. పరమ శివునికి ప్రమధగణములుండును. అమ్మవారికి యోగినీ గణములుండును. వీరందరు తమ భక్తులను రక్షించుటకై ఆరాటపడుచుందురు.

పూర్వము వేదశాస్త్రములను బోధించు పండితులు తమవద్ద చదువవలసినదని విద్యార్థులను ప్రోత్సహించెడివారు. వ్యాకరణ పండితుడు వ్యాకరణ శాస్త్రము చదివినచో సుశబ్ద జ్ఞానము కలుగుననియు అటులనే న్యాయశాస్త్ర పండితుడు నా దగ్గర చదివినచో వేదాంత శాస్త్రము చదువుట సులభమనియు చెప్పెడివారు. వారికి విద్యార్థులకు చదువు చెప్పవలయును కృతార్థులను చేయవలయునను ఆరాటమేగాని మరియొక స్వార్థము లేదు.

అటులనే దేవతలు తమను ఆశ్రయించిన భక్తులను కృతార్థులను చేయవలయునని ఆరాటపడుచుందురు.

గృహస్థులయినవారికి తమ యింటి వ్యవహారములు చూచుకొనుటకు సమయము చాలుటలేదు. అటులనే ఉన్నత పదవులలో వున్నవారికి కార్యభారము ఎక్కువగా వుండును. దేశ పాలకులయిన మంత్రులు, ప్రధానమంత్రులయినవారికి విశ్రాంతియే యుండదనుటలో అతిశయోక్తి లేదు. అటువంటి సమయమున అనేక కోటి బ్రహ్మాండములకు పాలకులయిన దేవతల స్థితి ఎటులుండును అని యూహించతగిన విషయము.

ఈ విషయమును విమర్శ చేయుటకు కారణము. పూర్వము దేవతలకు రాక్షసులకు యుద్ధములు జరిగిన విషయము పురాణములలో వున్నది. రాక్షసులయినవారు అందరిని బాధించటము. వారితోపాటు దేవతలను బాధించటము వారందరు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులను ఆశ్రయించటము, భూదేవి గగ్గోలు పెట్టటము మొదలగు కథలు పురాణములయందు కలవు. మరి యిప్పుడు రాక్షసులున్నటుల తెలియుట లేదు. మరి యిప్పుడు దేవతలు తమ తమ లోకములలో యుండి ఏమి చేయుచుందురు అను సందేహము అందరకు కలుగక తప్పదు.

అందులకే ఈ సమాలోచన.

ప్రమాణములలో అనుమాన ప్రమాణమొకటి. మామిడిచెట్టు మొలచువరకు అచ్చట మామిడి టెంక పడియున్నదని తెలియదు. అది మొలచిన తరువాత అచ్చట మామిడి టెంక పడియున్నది అని తెలియును. దీనినే అనుమాన ప్రమాణమని యందురు.

మనము చూచుచున్న ప్రకృతియంతయు జడము. అనంతకాలము నుండి క్రమబద్ధముగ జరుగుచున్నది. దీనిని క్రమబద్ధము చేసిన చైతన్యశక్తి మన ఊహకు అందనిది. ఆ శక్తి దీనినంతయును ఏయే రూపములలో నడుపుచున్నదో కొంచెము వివరించి తెలుసుకొనవలయును.

మనము ఏ విషయమును గుర్తించవలయునన్నను దానిని గుర్తించు

టకు తగిన కారణములను అన్వేషించవలయును. మనము భగవంతుని కార్యాచరణమును గుర్తించుటకు తగిన సాధనములు మూడు విధములుగ వున్నవి. ఒకటి శాస్త్రము రెండవది ఎదురుగా కనిపించు ప్రకృతి. మూడవది అనుభవము.

శాస్త్ర ప్రమాణముననుసరించి మన లోకమువలెనే దేవతా లోకములుగూడ అసంఖ్యాకముగ ఉన్నవని తెలియును. వారి స్థానములు వారి ప్రవృత్తులుగూడ తెలియును. ఉదాహరణమునకు ఇంద్రుడు నివసించునది స్వర్గలోకము. ఆయన వర్షములు కురిపించును. మరియు భూమిని సస్యశ్యామలము చేయును. అటులనే యముడు నివసించునది నరకలోకము. ఆయన పాపులను తగిన విధమున శిక్షించును. బ్రహ్మ సృష్టించును. విష్ణువు రక్షించును. శివుడు లయింపజేయును.

ఇవి శాస్త్ర ప్రమాణ వాక్యములు. ఆ దేవతల చేష్టలు ప్రకృతియందు కనిపించును. వర్షములు ఎక్కువగనో తక్కువగనో కురియుచునే యున్నవి. దీనివలన ఆహారము లభించి జీవులందరు బ్రతుకుచున్నారు. అది ఇంద్రుని కార్యము లోకమున కనిపించుచున్నది. జీవులు పుట్టుచున్నారు. అది బ్రహ్మకార్యము తెలియుచున్నది. విష్ణువు రక్షించును అందరు బ్రతుకుచునేయున్నారు. అందరు చనిపోవుచున్నారు. అది శివుని కార్యము. పాపులు కష్టములు అనుభవించుచున్నారు. అది యముని కార్యము. కాబట్టి శాస్త్రము చెప్పిన విషయములు లోకమున కనిపించుచున్నవి.

ఇంక మన యనుభవమునుబట్టి తెలుసుకొన తగిన విషయములు. మానవులమయిన మనము శాస్త్రప్రకారము సృష్టి జరుగుచున్నప్పటికిని కష్టములు అనుభవించుచున్నాము. అందులకు కారణము మనలోని దుష్ట స్వభావము. వాటిని విడనాడు శక్తి లేనివారు కష్టముల పాలగుదురు. వారి వలన సత్పురుషులుగూడ బాధపడుచుందురు. దేవతలు అట్టి వారి విషయమున తగిన జాగ్రత్త వహించి రక్షింతురు. ఇదియే వారి ప్రకృతి.

## 9. ఎంతటి వల్లమాలిన ప్రేమో ఈ తల్లికి!

ఈ పుడమితల్లి ఎండ, వాన, చలి అనక తన సంతానమయిన కొండలను, గుట్టలను, వాగులను, చెట్లను, పుట్టలను, పశువులను, పక్షులను, మానవులను, దానవులను, చీమలను, దోమలను మోసుకుంటూ అలుపుసొలుపు తెలియకుండగ పొర్లిగింతలు పెట్టుతూ సూర్యునిచుట్టూ ప్రదక్షిణాలు చేస్తున్నది. ఏనాటినుంచి చేస్తున్నదో, ఎందుకు చేస్తున్నదో ఈ సంతతికి తెలియదు. ఎలా తెలుస్తుంది ఆ తల్లి చెప్పందే. ఏ సంతతి కయినా తల్లి పుట్టుక తెలియదుగదా. ఈ తల్లి చెప్పదు. తాను వారితో మాటలాడుతూ వుంటే తన గమనము ఆగిపోతుంది. అది ఆగిపోతే తన సంతానం కష్టాలపాలవుతుంది. దానిని ఆమె భరించలేదు. అందుకనే మౌనంగా ప్రదక్షిణాలు చేస్తున్నది.

ఏ స్వార్థం లేకుండా ఇతరులకు ఉపకారం చేసే వారిని చూసి స్వార్థపరులయినవారు జడులు అంటారు. కాని వారు జడులు కారు, జడులు లాగా వుంటారు. అలాగే భూమాతను కూడా కొందరు జడము అంటారు. అది పూర్తి అసత్యము. ఎందుకంటె ఎంత తెలివి లేకపోతే ఇంత జాగరూకతతో, తీవ్ర నిష్ఠతో పుడమి మాత ఏమాత్రము దారి తప్పకుండ లక్షలాది సంవత్సరాల నుండి తన సంతానముతో ప్రదక్షిణాలు చేయగలుగుతుంది. నిజంగా జడమయితే ఆ చైతన్య రహితమయిన దాని నుండి చైతన్యము గల జీవరాశులు ఎలా పుట్టుతాయి. కాబట్టి చైతన్యవంతమని ఒప్పుకోవాలి.

అయితే ఈ ప్రదక్షిణాలు చేయట మెందులకు?

ఈ ప్రదక్షిణాలు గ్రుడ్డి యెద్దు చేలో పడినట్లు, పనిలేని మంగలి పిల్లి తల గొరిగినట్లు కాదు కదా! కాదు. ముమ్మాటికిని కాదు. ఆమె తన సంతానాన్ని రక్షించుకోవటానికి ఈ ప్రదక్షిణాలు అన్నీ చేస్తున్నది.

ఆమె అలా ప్రదక్షిణాలు, పొర్లిగింతలు పెట్టుచూ తన సంతతికి రక్షణ కల్పిస్తున్నది. అలా దొర్లటం వలన సూర్యుని కిరణాలకు దగ్గరగా దూరంగా తన సంతతిని ఉంచగలుగుతున్నది. దానివలన వేరువేరు సమయాలలో వేరువేరు ఫలాలను, పూలను, పంటలను యివ్వగలుగుతున్నది. తాను సూర్యుని వేడి కిరణాల బాధను సహించి, గ్రీష్మానికి గురియై తన సంతతికి మామిడిపండ్లు, మల్లెపూలు అందిస్తున్నది. తాను సూర్యునికి దూరమై చలిబాధ భరిస్తూ తన సంతతికి చామంతిపూలు, గుమ్మడికాయలు అందిస్తున్నది. ఇంక కొంతసేపు అటు ఇటు ఉండి సీతాఫలాలు, రేగులు అందిస్తున్నది. ఇలా వేరు వేరు ఫలాలు, కాయలు, పూలు అందించడానికి పుడమితల్లి తాను నానా కష్టాలు పడుతున్నది.

తల్లికి పిల్లలందరూ సమానమే. కొందరు పిల్లలు బలవంతులు, కొందరు బలహీనులు, కొందరు స్థూలశరీరులు, కొందరు సూక్ష్మశరీరులు. నడవలేని వారు, చెప్పలేని వారు ఎందరో వుంటారు. తల్లి అందరినీ సమానంగా చూచి ఒకరితో ఒకరికి కలహాలు, పొరపొచ్చాలు రాకుండా కాపాడుతూ వుండవలసి యున్నది. అందరకు తన నివాసాన్ని తగిన విధంగా పంచి యిచ్చింది. మానవుల లాంటి జీవులకు తన వీపులాంటి మెరక భాగాన్ని అందజేసింది. వీరి వలన కలహాలు రాకుండుటకై చేపలు లాంటి జంతువులకు నీటి భాగాలు పంచి యిచ్చింది. బక్కచిక్కిన ప్రాణుల రక్షణకై రెక్కలు యిచ్చి ఆకాశాన్ని అప్పజెప్పింది. ఈ విధంగా తల్లి అన్ని విధాలుగా రక్షిస్తున్నది. అయినా ఆమెను గురించి ఆలోచించేవారే కరువైనారు. అయినా ఆ తల్లి మాత్రము తన కర్తవ్యాన్ని మరవటం లేదు.

కొందరు క్రూరస్వభావముగలవారు ఆమె లోపల ఏమున్నదోనని పొట్ట పగలతీసి నరాలు తెంపి చూస్తున్నారు. అయినా ఆమె ఓర్పుతో క్షమిస్తున్నది. మరీ బాధను ఓర్చుకోలేనపుడు వేడి కన్నీరు కారుస్తున్నది.

ఆ కన్నీరే లావాలు. అలాగే వీరి అఘాయిత్యాల వలన భయం కలిగినపుడు వణికిపోతున్నది. అదే భూకంపం. తన బిడ్డకు కష్టము కలిగినపుడు ఓర్చుకొనలేక సముద్రాలు పొంగుతున్నాయి. మేఘాలు నీటితోపాటు పిడుగులను వర్షిస్తున్నాయి. తన మనుమరాలి కష్టము చూచి వాయువు, అగ్ని కలసి విజృంభిస్తున్నాయి.

ఇది అంతా కల్పనా, ఊహా కాదు. ఆ తల్లి వలననే గదా మనమంతా జీవిస్తున్నాము.

తల్లికి పుట్టిన బిడ్డలు అందరూ చెడ్డవారు కాదు, కొందరయినా మంచివారు ఉంటారని తనను ఆదరిస్తారని ప్రతి తల్లి కలలు కంటుంది. అలాగే ఈ పుడమితల్లి కూడ తన కుమారులలో ఏ ఒకరయినా తన శ్రమ గుర్తించి ఆదరిస్తారని ఆశపడుతుంది.

మనం కొందరమయినా ఉదయము లేవగానే ఆ తల్లికి నమస్కరించి ఆదరిస్తే ఆమె సంతోషించి మనలను శుభాలు కలగాలని ఆశీర్వదిస్తుంది. సీమాంతర ఉగ్రవాదుల నుండి మన తల్లిని కాపాడుకోవడం నేటి మనందరి కర్తవ్యం.

